# శ్రీమత్ పెద్ద అహోబిళ ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం

రిజిష్టర్డు నెం 195/88

2-2-21, షావుకారుపేట, ఆళ్ళగడ్డ - 518 543 (కర్నూలు జిల్లా)

సంప్రదించ వలసిన అడ్రసు :

**6-3-609/161, ఆనంద నగర్, ఖైరతాబాద్**

**హైద్రాబాదు - 500 004. ఫోన్ నెంబర్లు : 33795 , 224320**

## నిత్యాన్నదాన పథకము

దక్షిణదేశ మందలి పవిత్ర పుణ్యక్షేత్రాలలో కర్నూలు జిల్లాలోని అహోబిళ క్షేత్రమూ ఒకటి దిగువ అహోబిళము, ఎగువ అహోబిళము అని ఈ క్షేత్రము రెండు పుణ్యక్షేత్రాలుగా ఉండి, వరద, అభయ ముద్రలతో శ్రీ నరసింహ్మస్వామి అర్ధాంగి శ్రీ లక్ష్మీదేవి సమేతంగా ఇక్కడ కొలువుదీరి భక్తులను అనుగ్రహిస్తున్నారు ఉత్తర, దక్షిణ భారత రాష్ట్రాలనుండి భక్తులు ఈ క్షేత్రానికి విశేషంగా వచ్చి స్వామి వారి దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శిస్తుంటారు

ఈ స్వామి వారిని తిలకించుటకు అరుదెంచే వైశ్య యాత్రీకులకు వసతి సౌకర్యాన్ని కలిగించుటకు గాను పెద్ద అహోబిళంలో నాలుగు అంతస్థుల భవనాన్ని మూడు సంవత్సరాల క్రితం నిర్మించినాము

19-5-1989 నుండీ నిత్యాన్నదానం చేస్తున్నాము

అన్నదాన పథకానికి రూ 1175/-లు విరాళంగా ఇచ్చినవారు శాశ్వత సభ్యులుగా ఉంటారు ఆ మొత్తముపై వచ్చు వడ్డీతో, ఆ దాత పేరున సంవత్సరానికి ఒక్కరోజు శాశ్వతంగా వైశ్య యాత్రీకులకు భోజనం పెట్టడం జరుగుతుంది

ఈ అన్నసత్రభవనాన్ని విస్తరిస్తున్నాం. అందుకు దాతల నుండీ విరాళాలు స్వీకరిస్తున్నాం ఈ భవన నిర్మాణానికి గాను రు 2500/-లు లేక అంతకు పై బడి విరాళంగా ఇచ్చిన దాతల ఫోటోలు ఈ అన్నసత్ర భవనము లోపల ఉంచబడతాయి

ఈ సత్రం భవన నిర్మాణానికి కానీ, నిత్యాన్నదాన పథకానికి కానీ విరాళం ఇవ్వదలచిన దాతలు నేరుగా పై పేర క్రాస్ చేసిన చెక్కు ద్వారా కానీ, క్రాస్ చేసిన డి డి. ద్వారా కానీ పై సంప్రదించవలసిన అడ్రసుకు పంపి రసీదు పొందవలెను

ఉదార హృదయముతో సహకరించ వలసిందిగా వైశ్య మహాశయులను కోరుచున్నాము

**విచ్చేనమెల్ల సుబ్బరాయుడు శ్రేష్ఠి** — అధ్యక్షులు

**మేడా నరసింహులు శ్రేష్ఠి** — ప్రధాన కార్యదర్శి

V.P - A5

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం

హెడ్ ఆఫీసు : కంభం    స్థాపితం : 1961    బ్రాంచి ఆఫీసు : శ్రీ శైలం

©.52262 ప్రకాశం జిల్లా.    © 87158 (S T D 08524) కర్నూలు జిల్లా

అతి పవిత్రమైన జ్యోతిర్ లింగములలో రెండవది ఐన శ్రీశైలం మహాక్షేత్రము పూర్వము దేవతల చేత, రాజుల చేత సేవింపబడిన విషయం పురాణముల ద్వారా వినుచున్నాము. ఐనను 1960 సం॥కు ముందు రవాణా సౌకర్యములు లేక గత వైభవము తగ్గినదనుటలో సందేహములేదు. ఒకవైపు రవాణా సౌకర్యములు మెరుగు అగుట, మరియొకవైపు అత్యంత శక్తివంతమైన కావర్ డ్యామ్, ప్రక్కనేనున్న పవిత్రమైన కృష్ణా నదిపైన నిర్మింపబడుచున్నందున యాత్రికుల రాకపోకలు అధికమైనవి.

1961 సం॥కి ముందే కేవలం మహాశివరాత్రి పర్వదినములలో వైశ్య యాత్రికులకు భోజన వసతులు కల్పించుచున్నా, మన కంభం వైశ్య సోదరులు నిత్యం వచ్చి పోవు యాత్రికుల యిబ్బందులు గమనించి ఎలాగైనా వైశ్య నిత్య అన్నదానము జరుప వలయుననే సంకల్పముతో 1961న శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల వారి అనుగ్రహంతో కంభం వైశ్య సోదరులు ఒక సంఘముగా ఏర్పడి బాడి రిజిష్టరు చేయించి నిత్య అన్నదానం జరుపుచుండిరి. 1963లో దేవాదాయ శాఖ కేటాయించిన స్థలమున పూజ్యశ్రీ సత్యసాయిబాబా గారి సువర్ణ హస్తములతో 5.12 63న తేదీన శంకుస్థాపన గావింపబడినది. అట్టి ఈ అఖిలభారత శ్రీశైలక్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం, శ్రీశైలం. దినదినాభివృద్ధి చెందుచూ ప్రస్తుతం అన్ని సౌకర్యములు గలిగిన 109 గదులు, భోజనశాల, ప్రార్థనామందిరం, కళ్యాణ మండపం, సమావేశ భవనము, గోసంరక్షణశాల, 24 గంటలు నీటి వసతి కలిగి పలు ప్రాంతముల నుండి వచ్చు యాత్రికుల మన్ననలనుబడయుచున్నది. నిత్యం రెండు పూటలు అన్నదానం జరుపుచూ, మహాశివరాత్రి పర్వదినముననూ, ప్రతి కార్తీక మాసము రెండవ సోమవారం నుండి మూడవ సోమవారం వరకు జరుగు వార్షిక శంకర శివనామ సప్తాహము సందర్భముననూ వచ్చు వేలాది వైశ్య యాత్రికులకు ఉచిత భోజన వసతి సౌకర్యములు కల్పించుచు వినోద కార్యక్రమములు నిర్వర్తించుచున్నాము. ఈ క్రింద తెలిపిన పద్ధతుల మేరకు పై మన సత్రమునకు పైకం చెల్లించిన దాతలందరు ప్రశంసనీయులు.

<u>అక్షయ మహారాజ పోషకులు :</u> ఈ సత్ర సంఘమునకు రు.11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు. అట్టి పైకమును షెడ్యూల్ బ్యాంకులలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరులో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందగలరు. అట్టి సభ్యత్వం పొందు దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు. అక్షయ మహారాజ పోషకుల "18×15" అంగుళములు (ఫ్రేమ్‌తోసహా) గల దాత ఫోటో సత్రం ఆఫీసు నందు బిగించబడును.

రు.1160-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు. ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును. ఆ రోజు రాత్రి దాతపేర సాధువులకు అన్నదానము చేయబడును. "12×10" సైజులో దాత ఫోటో సత్రావరణములో పెట్టబడును.

రు.116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవిత సభ్యులుగా ఉంటారు. ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరపున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క, జమ, ఖర్చులతో పోస్టు ద్వారా దాతలకు పంపబడుతాయి.

యన్.బి. : ప్రతియొక్క స్తోమత కలిగిన వైశ్య సోదరులు ఏదో ఒక పద్ధతిన సహకరించి సత్రాభివృద్ధికి తోడ్పడగలరని ఆశించు చున్నాము.

పోలిశెట్టి సత్యనారాయణ    యక్కలి బాలరత్నం
అధ్యక్షులు    మరియు కార్యవర్గ సభ్యులు    ప్రధాన కార్యదర్శి

# వైశ్య ప్రబోధిని

(మాసపత్రిక)



స్థాపితము
1969



సంపుటి
28



సంచిక
3



నవంబరు - 1996



సంపాదకులు :
'సంఘోద్ధారక'
'వైశ్యభూషణ'
పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి



ప్రాప్తిస్థానం :
వైశ్య ప్రబోధినీ
కార్యాలయం
"వాసవీ భవన్"
జయనగర్ కాలనీ,
కడప - 516 002.
ఫోన్స్ : 25025,-
24911


సంపాదకీయం

## ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్యుల కర్తవ్యం

(ఈ పత్రిక 1975 జూలై సంచికలో ఈ పత్రికా సంపాదకులు పై శీర్షికన వ్రాసిన సంపాదకీయాన్ని తిరిగి ప్రచురిస్తున్నాము. మాజీ మంత్రివర్యులు శ్రీ కె.రోశయ్య గారు 9.6.1975న జరిగిన సర్వసభ్య సమావేశములో ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభకు అధ్యక్షులయ్యారు. మహాసభ అధ్యక్షులుగా శ్రీ రోశయ్య గారు జరిపిన తొలి జిల్లా పర్యటన కడపదే. ఆ పర్యటనా కార్యక్రమాన్ని ఏర్పాటు చేయడములో ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య యువజన సంఘాల సమాఖ్య నిర్మాణ, ప్రధాన కార్యదర్శిగా ఈ పత్రికా సంపాదకులు అతి ముఖ్య భూమికను నిర్వహించారు. తన కడప జిల్లా పర్యటన జయప్రదమైన విషయాన్ని మరువని శ్రీ రోశయ్య గారు ఒక సందర్భములో "మహాసభ సభ్యత్వాన్ని నీవు కడపలో మంచి మనసుతో ప్రారంభించావు. అది బాగా జరుగుతూంది" అని వ్రాశారు. సంపాదకులు ఈ సంపాదకీయాన్ని అప్పటి మహాసభ ఆర్థిక స్థితినీ, మహాసభ ఉజ్వల భవిష్యత్తుకు తోడ్పడవలసిన బాధ్యతనూ రాష్ట్ర వైశ్యులకు గుర్తుచేయుటకే వ్రాశారను విషయము ఈ సంపాదకీయం చదివిన వారికి అర్థమౌతుంది. ఈ పత్రికా సంపాదకులుగా నాకూ - ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభకూ గల దీర్ఘకాలిక అనుబంధాన్నీ, మహాసభ ఈనాడు ఇంతగా బలోపేతము అవడానికి, ఈ పత్రికా సంపాదకులు చేసిన కృషినీ గుర్తుచేయుటకే యీ పునర్ముద్రణ.)

"కలౌ సంఘ బలి" అనేది అనుభవంతో పెద్దలు చెప్పిన సూక్తి. వ్యక్తి సాధించలేని కార్యాన్ని "సంఘం" సాధిస్తుందనేది వివాదంలేని మాట. అయితే ఆ సంఘము ఆర్థికంగా తగినంత బలాన్ని పుంజుకొని, తన కాళ్లమీద తాను

నిలబడుకోగల స్థితిలో ఉండాలి.

దానికి సమర్ధవంతమైన నాయకత్వం, కార్యవర్గంలో సేవాతత్పరత గల వారూ ఉండాలి.

దీనికి తోడు "సంఘము కొఱకు తాము"గాక. "తమ కొఱకు సంఘము" అనే భావనలో, ఆ సంఘానికి చెందిన వారెల్లరూ ఉండాలి. అప్పడే యే సంఘమైన అనుకున్నది సాధించగలదు

అందుకే, ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభకు నూతనంగా యెన్నికైన శ్రీ రోశయ్యగారు, మహాసభ ప్రస్తుత ఆర్ధిక స్థితిని సమగ్రంగా అవగాహన చేసుకొని. మహాసభకు పై లక్షణాలన్నింటిని చేకూర్చేందుకు ప్రయత్నపడాలనుకోవడం

మహాసభను ఆర్ధికంగా పటిష్టం చేయాలనీ, అందుకు రాష్ట్రమంతటా తిరిగి పదివేలకు పైగా మహాసభకు జీవిత సభ్యులను చేర్పించాలనీ సంకల్పించారు

సంకల్పించుటయేగాక, కడప జిల్లా అంతటా మూడు రోజులు తిరిగి, వారి సంకల్పాన్నీ, భవిష్యత్ కార్యక్రమాన్నీ వివరించారు నిజానికి వీరు తీసుకున్న యీ పర్యటన కార్యక్రమం, ఆర్ధికంగా పటిష్టం చేయాలనుకోవడం యెంతో ముఖ్యమైనది

నాయకుడు యెంత సమర్ధవంతుడైనా, ధాన్ని నడిపేందుకు తగినంత ఆర్ధిక వనరులు కూడ సమకూరినప్పడే ఆ సంఘము అనుకున్నది చేయగలదు. సంఘీయులకు తోడ్పడగలదు

శ్రీ రోశయ్య గారి సంకల్పాన్ని క్షుణ్ణంగా అర్ధంజేసుకొని, వారి యీ సంకల్పాన్ని వెంటనే కార్యరూపంలో పెట్టేందుకు వైశ్యుడై పుట్టిన ప్రతి వ్యక్తీ తమంతకు తామే ముందుకు రావలసి వుంది

అధ్యక్షులు తీసుకున్న యీ ప్రణాళికవల్ల, సభ ఆర్ధికంగా పటిష్టం కావడమే గాక, బాధ్యతాయుతులగు వ్యక్తులు వేల సంఖ్యలో భాగస్వాములు కావడం, విద్యుక్తంగా భావించడం జరుగగలదు.

జీవిత సభ్యత్వం రూ 101/- అనేది సామాన్యమైన వ్యక్తులకు బరువైనది గాదు కూడ కావున, ప్రతి ఆర్యవైశ్యుడు గూడ యీ విషయంలో సహేతుకంగా ఆలోచించి, మహాసభను ఆర్ధికంగా పటిష్టం చేయుటయే గాక. సమర్ధవంతమైన నాయకత్వాన్ని సద్వినియోగం చేసికొనుటకు ప్రయత్నించాలనుకోవడం అవశ్య కర్తవ్యం.

# సంఘము శక్తివంతమగు టెటుల?

(పై శీర్షికతో ఒక వ్యాసాన్ని కవి కేసరి స్వర్గీయ అద్దేపల్లి సత్యనారాయణ గారు 1963లో వ్రాశారు. స్వాతంత్ర్య సమర యోధులు శ్రీ కె.సి. గుప్త గారు తన సంపాదకత్వములో అప్పుడు వెలువడే 'గుప్త' పత్రిక 1963 మే సంచికలో యీ వ్యాసాన్ని ప్రచురించారు. రచయిత ఈ వ్యాసాన్ని అప్పటి కాలములో గల వైశ్య సంఘ స్థితిని దృష్టిలో పెట్టుకొని కర్తవ్యాన్ని గుర్తుచేస్తూ వ్రాశారు. 33 ఏండ్ల తర్వాత ఉన్న మనము సంఘ విషయములో ఆలోచించవలసిన తీరును అవగాహన చేసుకొనుటకు తోడ్పడాలని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము - సంపాదకులు.)

ప్రపంచమున కుత్తేజము కలిగించి, కుబేర సంతతి యనిపించుకొని కృషి వాణిజ్య గోరక్షణము లొనర్చుచు సర్వ జీవులకు పోషకులై విలసిల్లిన వైశ్యజాతి నానాటికి తీసికట్టై విలపించవలసిన స్థితికి వచ్చినది. పూర్వపు ఔన్నత్యమును పొందవలెనన్నచో - సంఘ హితార్థమై తమ జీవితాల నర్పించగల, సర్వ త్యాగాలు చేయగల, యువకులు నేడు మనకు కావాలి. ప్రగాఢ విశ్వాసముతో సంఘ హితమునకై సర్వస్వార్పణము చేయగల వారున్నప్పుడే, అట్టి వారుద్భవించినప్పుడే సర్వతోముఖ సౌభాగ్యము సిద్ధిస్తుంది. ఇట్టి వారుద్భవించినప్పుడే దేశము పునర్నిర్మాణ మగుచుండును.

ప్రతి మనిషికీ యొక వ్యక్తిత్వం యున్నట్లే ప్రతి సంఘానికీ ఒక వ్యక్తిత్వమున్నది. కొన్ని విషయాలలో, కొన్ని గుణాలలో ఒక మానవుడు మరొక మానవునకు భిన్నముగ నుండు నటులే ఒక జాతి మరొక జాతికి కొన్ని ప్రత్యేక లక్షణాల వలన భిన్నముగ నుండును. సృష్టి స్వభావములో ఒక్కొక్క మనిషి ఒక్కొక్క కార్యమును సాధించుటకు జన్మించు నటులే ప్రతి జాతికి ఒక లక్ష్య ముంటుంది. తాను వెలువరించవలసిన ఒక సందేశము, నెరవేర్చవలసిన బాధ్యతా యుండును. కనుక మన సంఘ కర్తవ్యం గురించి మన బాధ్యతను నెరవేర్చాలి. మన లక్ష్యాన్ని తెలుసుకోవాలి. విభిన్న సంఘముల పురోగమనములో మన పాత్రను అర్థము చేసుకొనవలెను.

మన శక్తి, మన బలము, మన జాతీయ జీవనమే - ధర్మాన్ని ఆశ్రయించి యున్నది. ఇటులనే కులములున్నంత వరకుండును. ఈ జీవన స్రవంతిని విడిచిన మరు క్షణంలో మృత్యువే గతి. శూన్యమే మిగిలేది. ప్రపంచంలో సంఘ జీవన నిర్మాణమునకు -ఒకటి ధర్మము నాశ్రయించియు, రెండవది సాంఘి కావసరముల నాశ్రయించియు ప్రయత్నములుండెను. మొదటిది ఆధ్యాత్మికత నాశ్రయించినట్టిది. రెండవది భౌతికత నాశ్రయించినట్టిది. మనకు లక్ష్యం ముక్తి. భాష వేదం, సాధనం త్యాగం.

మన కులములు, వ్యవస్థలు, మతముతో బంధింపబడి యున్నట్లు పైకి కనిపించినప్పటికీ, వాస్తవమది కాదు. మనను ఒక జాతిగా సజీవముగ నుంచుటకే వ్యవస్థ లవసరమైనవి. ఈ స్వాత్మ సంరక్షణావసరము తీరగనే యవి సహజముగ నంతరించును. ప్రపంచములో

పాపమనున దేదైనయున్నచో అదియొక్క భయమే. నిద్రాణ శక్తులను మేల్కొల్పే పనులొనర్చడమే పుణ్యము. మన శరీరాలను బలహీన మొనర్చు పను లొనర్చడమే 'పాపం'. ఇటులనే మన సంఘమున.కొనర్చుటయు పుణ్య పాపము లగును. నేడు భయమనునది కెరటముల వలె సర్వత్ర కనిపించు చుండెను. నేడీ కెరటములను త్రిప్పికొట్ట వలెను. దీనికి వ్యతిరేకమైన కెరటములను సృష్టించి అద్భుతమైన మార్పులను చూపించ వలెను. మీరు స్వశక్తిమంతులు. బలమే జీవనం, బలహీనతే మరణం, బలమే సుఖం, బలహీనత భరింపరానిది. ఈ దుస్థితికి భయమే కారణము.

అద్భుత రాజసికతేజం, అపాద మస్తకము తొణికిసలాడే ఒక మహా వీరుడు - సత్యాన్వేషణకై తెగించి ప్రాణాలొడ్డగల ధీరుడు, త్యాగమే ధనస్సుగా, విజ్ఞానమే కరవాలముగా కలిగిన వీరుడు నేడు మనకు ఆదర్శమై నిలవాలి. నేడు మనకు కావలసినది జీవితాన్ని సుఖోద్యాన వాటికగా భావించే ప్రేమ కలాపి కాదు. జీవన సంగ్రామ రంగంలో మహా యోధుడై నిలవగల వీరుని ఆదర్శం.

సౌశీల్యం, బుద్ధి, ఇతరులను సేవించుటకు సమస్తమూ త్యాగము చేయగల సంసిద్ధత గల యువకులు ముందుకు రావాలి. సాధారణ యువకు లెందరో లభించవచ్చు. స్తబ్దతే వారి లలాటాల మీద కనిపిస్తుంది. వారి గుండెలలో శక్తిలేదు. నీరస శరీరులు, ధైర్యహీనులు నైన వారీసమయమున నుత్తేజము కలిగించనూలేరు. ఆదర్శ వంతులూ కాలేరు. మహాత్మాగాంధీ, అమరజీవి పొట్టిశ్రీరాములు, దీక్షాదక్షుడు మానేపల్లి మల్లిఖార్జున గుప్తల కోవకు చెందినవారై - మన సంఘ సేవనే పరమా వధిగా గల వారే కొద్దివారైనను సరే - పూను కొనిన గాని వైశ్య సంఘ ముద్ధరింప బడదు.

శరీరము బలహీనముగా నున్నపుడే రోగ క్రిములు శరీరమున నిండి రోగమును సృష్టించి అభివృద్ధి పరచును. సంఘ విషయమూ ఇంతే. సంఘము బలహీనముగా నున్నపుడే రాజకీయాలలో - సమాజములో - విద్యా బౌద్ధిక రంగాలలో - కృషి, వాణిజ్య, గోరక్షణాది వృత్తులలో - వ్యాధి కారకములైన అనేక క్రిములు ప్రవేశించి పలు వ్యాధులను జన్మింప జేయును. ఇవియన్నియు నిపుడు మన సంఘము నావరించి యున్నవి దీనిని తొలగించుటకు వ్యాధిమూలమును శోధించి రక్తమును సమస్త దోషముల నుండీ క్షాళనము చేయాలి.

మన పూజలలో ప్రప్రథమముగ సేవ్యమైనది సంఘసేవ. దానినే ఆరాధించు, మన సంఘమే మనము ప్రథమముగా ఆరాధింపదగిన దైవం. త్యాగము, సేవ, మనజాతికి ఆదర్శం సంఘమును బలపరచండి., తరువాత దాని జాగ్రత్త అదిపడుతుంది. మన ప్రాచీన మాతృదేవి మరల మేల్కొంచి పునరుద్ధ రింపబడిన సింహాసనముపై మున్నెన్నడూ లేనంత మహా వైభవముతో ఆసీనురాలై యున్న దృశ్యం కాంచండి. శాంతి శుభ కామనాస్వరంతో ఆమె వైభవమును విశ్వమెల్ల మార్మోగించండి.

జై భారత్!

వైశ్యప్రబోధిని, నవంబరు 1996

# అగర్వాల్లూ - ఆర్యవైశ్యులూ

శ్రీ పి. లక్ష్మీకాంతం శ్రేష్ఠి - సంపాదకులు.

పండిత జ్వాలా ప్రసాద్ మిశ్ర గారు మురాదాబాద్ నివాసులు. వీరు హిమాచలము నుండీ కన్యాకుమారి వరకు గల వివిధ రాష్ట్రాలలో ఆనాటికి ఉన్న వర్ణాలనూ, వాటి శాఖలనూ క్రోడీకరించి 'జాతి భాస్వరము' అను గ్రంధాన్ని వ్రాశారు ఆ గ్రంధములో ఆనాటికి ఉన్న వైశ్యుల శాఖలను 39గా పేర్కొన్నారు. అయితే అంతకన్నా ముందు 17వ శతాబ్దికి చెందిన ఆంగ్ల చారిత్రక పరిశోధకులు 'లార్డు మర్పి', 'లార్డు డౌట్' అను వారు 'భారతీయ వైశ్యుల చరిత్ర'ను వ్రాసే ప్రయత్నములో భారతీయ వైశ్యులకు సంబంధించి 1800 శాఖలతో ఒక సూచికను తయారు చేసినట్లుగా స్వర్గీయ తేరాల జగదీశ్వరయ్య గుప్త గారు తమ 'భారతీయ వైశ్యులు' అను వ్యాసములో పేర్కొ న్నారు. అయితే - స్వర్గీయ గుప్తగారు తమ వ్యాసం 'భారతీయ వైశ్య'లో 39 శాఖల పేర్లనే పేర్కొన్నారు. కానీ భారత దేశములోని రాష్ట్రాలలో నివసించు వైశ్యులు 83 శాఖలుగా ఉన్నారని పేర్కొంటూ "రాష్ట్ర వైశ్య సంస్థల సమాఖ్య ప్రచురించిన భారత దేశములో వైశ్యులు" అను వ్యాసములో ఆ 84 శాఖలనూ పేర్కొన్నారు శ్రీ కె.సి. గుప్త గారు. గుప్తగారు పేర్కొన్న ఆ 83 శాఖలలో మొట్టమొదటి శాఖ పేరు అగ్రవాల్. అగ్రహోల్, అగ్రవాల్, అగ్రవాలే, అగర్వాల్ అని కూడ ఈ శాఖను పిలుస్తారు.

ఈ 83 శాఖల్లో చేరిందే 'ఆర్యవైశ్య' అను శాఖ కూడ. ఈ రెండు శాఖలకు గల పోలికలే ఈ వ్యాసం.

అగర్వాల్స్‌కు మూల పురుషుడు అగ్రసేన మహారాజు ఆర్యవైశ్యులకు మూల పురుషుడు కుసుమార్యుడు.

అగ్రవాల్ వంశానికి మూలస్థానం 'అగ్రాహా' నగరము. ఇది హరిద్వార్‌కు పశ్చిమ దిశలో - ఇప్పటి హర్యానా రాష్ట్రములోని హిస్సార్ ప్రాంతములో ఉంది. మహాభారత యుద్ధానంతరము వెలసిన గణతంత్ర రాజ్యాలలో ఒకటి. 'అగ్రేయ గణరాజ్యం' అని అప్పట్లో పిలిచేవారు.

ఆర్యవైశ్యులకు మూలస్థానం పెనుగొండ, ఇది ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములోని పశ్చిమగోదావరి జిల్లాలో తణుకు పట్టణానికి సమీపములో ఉంది అగ్రేయ గణరాజ్యం లాగే పెనుగొండ కూడ గణతంత్ర రాజ్యమే. కుసుమార్యుడు పెనుగొండకు ప్రభువు

ప్రాచీన కాలములో వేరు, వేరు తెగల వారు కొందరు కొందరు కలిసి ఒక్కొక్క రాజ్యాన్ని నిర్మించుకునే వారు వీరిలో ఒక్కొక్క తెగవారు కొందరు ప్రతినిధులను ఎన్నుకొని వారిద్వారా పరిపాలన నిర్వహించే వారు. ఇట్టి రాజ్యాలే గణ రాజ్యాలు.

అగ్రసేన మహారాజు తనరాజ్యాన్ని 18 గణ రాజ్యాలుగా విభజించి విస్తరించి ప్రజాస్వామ్య పద్ధతులలో పాలించాడు.

కుసుమార్య ప్రభువు కూడ తన రాజ్యాన్ని 18 నగరాలుగా విభజించి, విస్తరించి, ప్రజాస్వామ్య పద్ధతులలో పరిపాలించాడు.

అగ్రవాల్స్‌కు ప్రధాన ఆరాధ్య దైవం మహాలక్ష్మి. 'అగ్రాహా' పట్టణములో శ్రీ మహాలక్ష్మి ఆలయాన్ని అత్యంత రమణీయంగా నిర్మించి, అనుదిన అర్చనలు జరుగు ఏర్పాటు చేశారు అగ్రసేన మహారాజు.

ఆర్యవైశ్యులకు ప్రధాన ఆరాధ్యదైవం (కులదేవత) శ్రీ కన్యకా పరమేశ్వరీదేవి. పెనుగొండ పుర మధ్యలో శ్రీ కన్యకా పరమేశ్వరీ ఆలయాన్ని నిర్మించి, అనుదిన అర్చనలు జరుగు ఏర్పాటు చేశాడు కుసుమార్యుడు. ఇప్పటి పెనుగొండ పట్టణములోని లింగాలవీధిలో కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయము ఉండేదనీ, ఆ ఆలయం శిథిలం కాగా, యానాం జమీందారులు మన్నెంకనకయ్య అను వైశ్యుడు అక్కడ ఉన్న కన్యకా పరమేశ్వరీ విగ్రహాన్ని తీసుక వచ్చి పెనుగొండలో ఇప్పుడున్న శ్రీ నగరేశ్వరాలయములో ప్రతిష్ఠించాడు అని పండితశ్రీ స్వర్గీయ జమిళి నమ్మాళ్వార్ అనేకమార్లు చెప్పేవారు.

శ్రీ మహాలక్ష్మి శ్రీ కన్యకా పరమేశ్వరి అను ఈ రెండు నామాలు కూడ ఆదిశక్తి సబంధించనవై, భారతీయ వైశ్యులు మాతృదేవతారాధకులని తెలుపుచున్నవి.

అగ్రవంశజులు అనగా అగ్రవాల్లు మహాలక్ష్మీదేవిని, మరువక ఆరాధించినంత వరకూ వారు అన్ని రకాల వైభవాలనూ అనుభవిస్తారు. సమాజములో ముందుంటారు.

ఆర్యవైశ్యులు కూడ అంతే. శ్రీ కన్యకా పరమేశ్వరీ దేవిని భక్తి శ్రద్ధతో పూజించినంత, కాలమూ అభ్యుదయ పరంపరాభి వృద్ధులను పొందుతారు.

అగ్రవాల్లు 18 గోత్రాలకు పరిమితం.

ఆర్యవైశ్యులు 102 గోత్రాలకు పరిమితం.

అగ్రసేన్ మహారాజు కాలము నుండీ అగ్రవాల్లు 18 గోత్రాలవారుగా ప్రసిద్ధి పొందినా, వాస్తవానికి ఉన్నవి 171/2 గోత్రాలే. అగ్రసేన మహారాజు 18 యాగాలను చేయాలని తలపెట్టి 18వ యాగాన్నిసగంలో ఆపివేశాడట. అందువల్ల 171/2 గోత్రాలే ఆయ్యాయి.

ఆర్యవైశ్యులు 102 గోత్రాలవారు గానే పిలువ బడుచున్నా, 101 గోత్రాలవారే ఉన్నారు. పురాణం ప్రకారం, అగ్నిగుండ ప్రవేశం చేసిన ఒక గోత్రమువారు నిస్సంతువులు.

అగ్రవాల్లకు గల 18 గోత్రాలూ ఋషి గోత్రాలే.

ఆర్యవైశ్యులకు గల 102 గోత్రాలూ ఋషి గోత్రాలే. తేడా సంఖ్యలోనే.

అగ్రవాల్లు ఋషి గోత్రానికి బదులుగా గర్గ, గోయల్ ఇత్యాదిగా 18 గోత్రాలను చెప్పుకొంటూరు. వీటిని వీరు ప్రచలిత గోత్రాలు అని పిలుస్తారు.

ఆర్యవైశ్యులు ఋషి గోత్రానికి బదులుగా శ్రీలకుల, బలిసెట్ల, పావళ్ళ మొదలగు పేర్లను చెప్పుకొంటూరు. వీటినే సాంకేతిక గోత్రములు అన్నారు.

ప్రతియేడూ ఆశ్వయుజ శుద్ధ పాడ్యమిని అగ్రసేన్ జయంతిగా అగ్రవాల్లు జరుపుకొంటారు. వైశాఖ శుద్ధ దశమిని వాసవీ జయంతిగా జరుపుకుంటారు ప్రతియేడూ ఆర్యవైశ్యులు

మానవులందరికీ ఆధ్యాత్మికశక్తి అవసరమని బోధించాడు అగ్రసేన్ మహారాజు.

మానవులందరికి ఆధ్యాత్మిక చింతన అత్యంతావశ్యకమని బోధించింది శ్రీ వాసవీ దేవి.

అగ్రవాల్లు శుద్ధ శాఖాహారులు, సాత్విక జీవనులు.

ఆర్యవైశ్యులు కూడ శుద్ధ శాఖాహారులు. సాత్విక జీవనులు.

వైశ్యప్రబోధిని, నవంబరు 1996

గోరక్షణ, వ్యవసాయము, వ్యాపారము అగ్రవాల్లకు ప్రధాన జీవనోపాధులు.

ఆర్యవైశ్యులకు కూడ పై మూడే ప్రధాన జీవనోపాధులు.

అగ్రవాల్లకు సగోత్ర వివాహం నిషేధం.

ఆర్యవైశ్యులకూ అంతే. సగోత్ర కన్యను వివాహం చేసుకోరాదు.

ఆచార్య. హేమ చంద్ర సూరి, విక్రమాదిత్యుడు, భామశాహుడు, భారతేందు హరిశ్చంద్ర, సర్. గంగారాం, శివప్రసాద్ గుప్త, డా. రఘువీర్, సర్ శాదీలాల్, రామమనోహరలోహియా, ప్రఖ్యాత హిందీ సాహిత్యవేత్త మైథిలీ శరణ్ గుప్త మొదలగు వారు అగ్రవాల్ శాఖీయులైన వైశ్యులు.

తొలి తెలుగు నైఘంటికులు శ్రీ మామిడి వెంకటార్యులు, మహాపండితులు, శ్రీ ఆత్మూరి లక్ష్మి నరసింహ సోమయాజి, రెడ్డి రాజ్య స్థాపనకు మూల కారకులైన అవచి తిప్పయ్య శ్రేష్ఠి. ప్రథమ నవలాకారుడు శ్రీ నరహరి గోపాలక్రిష్ణమ శ్రేష్ఠి, ప్రసిద్ధ అష్టావధాని, శతావధాని శ్రీ దోమా వెంకట స్వామి గుప్త, రాజకీయవేత్త శ్రీ పెండేకంటి వెంకట సుబ్బయ్య, పరివ్రాజిక శేఖరులు స్వామి శుద్ధ చైతన్య, విద్యా ప్రకాశానంద మొదలగు వారు ఆర్య వైశ్య శాఖీయులైన వైశ్యులు.

అగ్రవాల్లు తమ ప్రచలిత గోత్రాన్ని తమ పేరు చివర చేర్చుకుంటారు.

ఆర్యవైశ్యులు సర్వసామాన్యంగా శ్రేష్ఠి, సెట్టి, గుప్త మొదలగు నామాలను తమ నామధేయాలకు చివరలో ఉంచు కుంటారు.

## అగ్రసేన్ వంశ పరంపర - 18 గోత్రాలు

| క్రమసంఖ్య | అగ్రసేనుడి కుమారుని పేరు | ప్రచలిత గోత్రం | వంశ్య ఋషి |
|---|---|---|---|
| 1. | విషపదేవుడు | గర్గ | గర్గ |
| 2. | గేందుమలుడు | గోయల్ | గోమిల |
| 3. | కర్ణచంద్ | కచ్చల్/కుచ్ఛల్ | కాశ్యప |
| 4. | మణిపాలుడు | కాసిల్ | కౌశిక |
| 5. | బంధుభానుడు | బిందల్ | వశిష్ఠ |
| 6. | ఢాబదేవుడు | ఢాలన్ | ధౌమ్యుడు |
| 7 | సింధుపతి | సింహల్(సింఘాల్) | శాండిల్య |
| 8. | జీలజనకుడు | జిందల్ | జైమిని |
| 9. | మంత్రపతి | మిత్తల్ | మైత్రేయుడు |
| 10. | తంబోల కర్ణుడు | తింగల్/తుంగల్ | తాడేయ |
| 11. | తారాచంద్రుడు | తాయత్ | తైత్తిరీయ |
| 12. | వీరభద్రుడు | బాన్సల్/బన్సాల్ | బత్సిస్య |
| 13. | వాసుదేవుడు | టేరన్ | కౌశల్ |
| 14. | నాహరసేనుడు | నాంగల్ | నాగేంద్ర |
| 15 | అమృతసేనుడు | మంగళ్ | ముద్గల |
| 16. | ఇంద్రసేనుడు | ఐరన్ | ధనజ్వాల |
| 17. | మాధవసేనుడు | మధుకుల్ | పరాశర |
| 18. | గోధరసేనుడు | గోయిన్ | గౌతమ |

జై శ్రీమన్నారాయణ ఓం నమో వెంకటేశాయ జై శ్రీమన్నారాయణ

విశ్వశాంతికై

# శ్రీ లక్ష్మీచెన్నకేశవ స్వామి దేవస్థానము

## పేరు సోముల గ్రామము వారి

అఖండ శ్రీ లక్ష్మీ అష్టోత్తర సహిత శ్రీవిష్ణు సహస్ర నామస్తోత్రపారాయణ

మండల దినపర్యంత (41 రోజులు) మహోత్సవములు

శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ జీయరు స్వామి వారి మంగళా శాసనములతో

## ఆహ్వానము

**భగవత్ బంధువులారా!**

విశ్వశాంతికై పేరుసోముల గ్రామములో (కర్నూలు జిల్లా) వెలసిన శ్రీ లక్ష్మీ చెన్నకేశవ స్వామి సన్నిధానములో భగవత్ ప్రేరణచే **12-11-96** నుండి **22-12-96** వరకు అనగా శ్రీ ధాతృనామ సంవత్సర కార్తీక శుద్ధ పాడ్యమీ మంగళవారము నుండి మార్గశిర శుద్ధత్రయోదశీ ఆదివారము వరకు అఖండ శ్రీలక్ష్మీ అష్టోత్తర సహిత శ్రీ విష్ణు సహస్రనామస్తోత్ర పారాయణము అన్ని ప్రాంతాల విష్ణు సహస్రనామస్తోత్ర సంఘాల భక్తుల పరస్పర సహకారముచే జరుపబడును

శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రమును పుస్తకములు చూచి గాని, చూడకుండాగాని పారాయణము చేయగల స్త్రీ, పురుషులందరినీ అపూర్వముగా జరుగనున్న ఈ కార్యక్రమములో పాల్గొనవలసినదిగా ఆహ్వానించుచున్నాము. ఈ అపూర్వమైన అవకాశము మీరందరూ తప్పక వినియోగించుకొని శ్రీ చెన్నకేశవ స్వామి కృపకు పాత్రులగుదుర్గని ఆశిస్తున్నాము

**గమనిక:1 ఈ పారాయణ కార్యక్రమములో పాల్గొను వారికి ఉచిత భోజన వసతులు కల్పించబడినది**

## Correspondence Address

1. N. Ramanaiah, Sri Chennakesava Medical Agencies,
   Old Post Office Road, KURNOOL - 518 001. Ph. No.: 21341, Res : 25966.
2. K. Ramachary, Sri Kota Anjaneya Swamy Temple,
   H.No. 62/86, KURNOOL - 518 001. Ph. No. : 25117.

ఇట్లు

తమ ఆగమనాభిలాషులు

**నిచ్చెన మెట్ల రమణయ్య, శ్రీ లక్ష్మీ చెన్నకేశవ దేవస్థానం,**

పేరు సోముల, సంజామల మండలము, కర్నూలు జిల్లా.

పేరు సోములకు రావలసిన వారికి :

వయా తాడిపత్రి, కోవెలకుంట్ల, జమ్మలమడుగు నుండి బస్సు సౌకర్యం కలదు.

# నేను నా దేశం

(గత సంచిక తరువాయి)

## స్వాతంత్ర్యయాత్ర

మోక్షంకొరకు ఎన్నో యాత్రలు చేస్తారు. జీవితంకూడా ఒకయాత్రే! దైవభక్తి, దేశభక్తి మానవసేవలే కద్దా! ప్రజలు ప్రశాంతంగా జీవించాలనే కదా వీటి ఆదర్శం. "సర్వేజనా సుఖినో భవంతు". మానవులు వాస్తవమైన మానవుల్లాగా అనగా సర్వశక్తులను అభివృద్ధికి తెచ్చుకొనుచూ జీవించుటకే కదా ఈ సాధనాలు; ఇతరుల సేవకొరకు, దాస్యం కొరకుకాదు మానవులు జీవించేది.

స్వార్థం ఒక దశలో మానవునికి అవసరం, జీవితమంతాకూడ కొంతవరకు అవసరమే! అయితే, మానవునిలోని మానవత్వం చక్కగా వికసించాలంటే నానాటికి పరార్థం పెరుగుతూ ఉండాలి తన కష్టసుఖాలు సోదర మానవుల కష్టసుఖాల్లో లీనంకావాలి. స్వార్థపరుడే దోపిడిగాడుగాను, రాక్షసుడుగాను, చివరకు భస్మాసురుడుగాను పరిణామం పొందుతాడు.

ఆదిలో మానవుడు మోక్షంకొరకు ఎన్ని ప్రయాసలు పడ్డాడు! తిరుపతిలో ఏడుకొండలు ఎక్కుతాడు. అడవుల్లో, కొండల్లో, భీకర మృగాలచే, దొంగలు, దోపిడిగాండ్రవల్ల ఎందరో చచ్చిపోయారు. చివరకు మానవుడు కష్టాలను జయించి, తాను ఆరాధించే దేవతను దర్శించాడు. సర్వజనులు తనవలెనే మోక్షం పొందాలనే ఆదర్శంకొరకు సోపానాలు కట్టాడు. సత్రాలు నిర్మించాడు. కోనేరులు త్రవించాడు; గుళ్ళు గోపురాలు కట్టాడు. అందరిని మోక్షం పొందమన్నాడు. అంతవరకు తన ఆత్మకు శాంతి, సుఖము, మోక్షము కలుగవనే ధర్మాన్ని గుర్తించాడు.

కాలానుగుణ్యంగ మానవుని అభిప్రాయాలు మారుతాయి. దైవభక్తే మానవసేవ అవుతుంది. అదే దేశ భక్తిగా పరిణమించుతుంది.

ప్రస్తుత కాలంలో దేశసేవే మోక్షసాధనము 1900 సంవత్సరం నుండి స్వాతంత్ర్యం కొరకు, విముక్తి కొరకు, దేశం సుభిక్షంగా ఉండుట కొరకే, నలభైకోట్ల భారతీయులూ సుఖంగా జీవించుట కొరకే, మన తాతలూ, తండ్రులూ ఎంతో ప్రయాస పడ్డారు. స్వాతంత్ర్య దేవత ఎక్కడో ఉన్నది. ఆమెను దర్శనం చేసుకోవాలి. వరాలు సంపాదించుకోవాలి. మోక్షం సాధించాలి. అందుకు ఎన్నో కష్టాలు పడాలి. నలభై కోట్ల భారతీయులు సుఖ సంపదలతో జీవించాలి! అదే దేశభక్తిలోని సారం.

1900 సంవత్సరంలో యువకులు స్వతంత్ర యాత్రకు బయలు దేరారు. పెద్దలు అడ్డుపడ్డారు. అయితేనేమి? కొందరు యువకులు సాహసించే ప్రయాణం సాగించిరి: కొండల్లోను అడవుల్లోను ఉండే భయంకర మృగాల కన్న

క్రూరమానవులున్నారు. తెల్లరాక్షసులు వారినికొట్టి జైళ్ళలో వేశారు; చివరకు చంపారు. అయితేనేమి? పెద్దల హితబోధను చెవిని పెట్టలేదు. ఉద్యోగము, దాస్యము, ద్రవ్యము మోక్షసాధనాలు కావని యువకులకు తెలుసు. తెల్ల రాక్షసులతో పోరాడి ఎందరో నశించారు. అయితేనేం? ఏ కొద్దిమంది యువకయోధులో మొదటికొండ ఎక్కారు. అలసిపోయారు. స్వాతంత్ర్యదేవతఆలయమైనా కనుపించ లేదు. "టెర్రరిస్టు" లని తిట్లుతిన్నారు.

వారి అగచాట్లు చూస్తూ కొందరు జీవచ్ఛవాల్లాగ ఉండలేక పోయారు. తమ తండ్రులు, తాతలు, ముత్తాతలు ఎన్నో యుద్ధాలు చేసిన వారే! అట్టి సంతతివారు అయినందుననే ఇట్టి పౌరుషం కలిగింది. టెర్రరిస్టుల సహాయానికి, స్వాతంత్ర్య దేవత దర్శనానికి వెళ్ళారు. ఎందరో నశించిపోయారు. కాని, తమ యాత్రను వదల్లేదు. మరొకకొండనెక్కారు. స్వాతంత్ర్య దేవత దర్శనంమాత్రం లభించనేలేదు కాని, ఆ గదరు వీరులలో చాలా మంది ఆహూతి అయ్యారు.

"భయపడవద్దు; నిరాశచెందవద్దు, ఇదిగో వస్తున్నాము లక్షల కోట్ల మందిమి! సంపూర్ణ స్వాతంత్ర్య దేవత దర్శనం అయ్యేవరకు మా సంకల్పము విడువము! రాక్షసులను, దోపిడిగాండ్రను నాశనం చేస్తాము. ధనము, సౌఖ్యం, విజ్ఞానం అందరికీ కలిగేలా చేస్తాము" అని గర్జిస్తూ ముందుకు నెట్టుకుంటూ గుంపులు గుంపులుగా, తండోప తండలుగా వచ్చారు జాతీయ యోధులు. గదరు వీరులను రెండో కొండ శిఖరంమీద కలుసుకొన్నారు.

మూడవ కొండ ఎక్కడం ప్రారంభించారు. ఎంతదూరం! ఎంత ఎత్తు? అయితేనేం? రాక్షసిమూకను ధ్వంసంచేస్తూ ముందుకు సాగిపోయారు, కొంతమంది పారిపోయారు, కొందరు దాసులయ్యారు. జాతీయ యోధులకు తోడ్పడుతామని ప్రమాణం చేస్తున్నారు.

అదిగో నాల్గవకొండ! ఆ కొండమీద స్వాతంత్ర్య దేవత దేవాలయం ఉన్నది చూడండి. అయితే "ఆ కొండపై కెక్కడం సాధ్యంకాదు. నిటారుగా వున్నది; చాలా ఎత్తు. జారుతుంది. అని ప్రజాద్రోహులు, దోపిడి గాండ్రు భయపెట్టారు. జాతీయ యోధులు ముసలివారయ్యారు. ముప్పయి సంవత్సరాల పోరాటంవల్ల నీరసించి పొయ్యారు. ఇక కొండ ఎక్కలేరు. మనోబలంకూడ క్షీణించిపోతున్నది. చివరకు శత్రువులనే మిత్రులుగ భావించి మోసగింపబడుతున్నారు. మూడవకొండ శిఖరము మీదనుండే గుడివైపు సాష్టాంగ నమస్కారం చేశారు.

"ఓ దేవతా! మేము నీవద్దకు రాజాలము. నీవే మా వద్దకువచ్చి నీ భక్తులమైన మాకు దర్శన మివ్వాలి" అని ప్రార్థించుతున్నారు వస్తుందని భక్తులు కలలు గంటున్నారు.

అయితే, ఈ యోధుల బిడ్డలు, మనుమలు మోసపోలేదు. నాల్గవ కొండ ఎక్కవలసిందేనని సంకల్పించారు. ఎక్కడం ప్రారంభించారు. జారిపడి

పోతున్నారు. ఎన్నికష్టాలు వచ్చినా ముందుకు దూకుతున్నారు. కొండలు, లోయలు, అడవులు, భీకర మృగాలు యువకయోధుల ధైర్యసాహసాలకు తాళలేక భయపడిపోతున్నాయి. ఏమి సంకల్పదీక్ష! ఏమి సాహసం? ఏమి త్యాగం! ఎంతమంది నశించినా ముందుకాలు ముందే ఉంటున్నది.

అదిగో! గుడిలో జ్యోతి వెలుగుతున్నది. అరుణ కాంతులు విరజిమ్ముతున్నది. ఆ దీపంలో ఉన్నది వీరాధివీరుల - దేశభక్తుల రక్తం!

అబ్బ! లోయ ఎంతలోతు! శిఖరం ఎంత ఎత్తు! అయ్యో! నేను దూకలేను! అయ్యో! నేను ఎక్కలేను" అన్నాను కాళ్ళ నొప్పులతో.

"తాతగారూ! ఇంతదూరం వచ్చారు. భయపడవద్దు. ఆ బరువు మొయ్యలేవు! ఆయుధాలు మాచేతికి యివ్వు! మా చేతులు పట్టుకో! మా భుజాలమీద కూర్చో! దేవతాదర్శనం చేయిస్తాము! రా! తాతా! రా!" అన్నారు యువకయోధులు.

"36 సంవత్సరాల సాధన, తపస్సు జ్ఞాపకముంచుకో! ధైర్యం చెయ్యి! ఒక్కదూకు దూకు!" అన్నారు మనుమలు, మనుమరాండ్రు.

"యువకుల్లారా! యోధుల్లారా! మీరు ముందుకు సాగిపోండి! మీవేగాన్ని కుంటుపరుస్తున్నాను. నా కొరకు కాచుకోవద్దు! నేను విశ్రాంతి తీసుకోవాలి! వెళ్ళండి నాయన్లారా! వెళ్ళండి!" అని వేడుకొన్నాను.

"యువకుల్లారా! దేవతను ఏమేమి వరాలడుగుతారు? కేవలం స్వరాజ్యం మాత్రమే చాలదు. కేవలం ప్రజా ప్రభుత్వంకూడా చాలదు. అందరికీ అన్నం, ఇండ్లు, బట్టలు, మందులు, చదువు, సంస్కృతి కావాలని అడగండి. మన నలభైకోట్ల భారతీయులకే కాదు! సర్వసమాన జాతికి కావాలని కోరండి........ చాలదు!...... చాలదు! అందరికీ రేడియోలు, కార్లు, ఏరోప్లేనులు కావాలని అడగండి. సంశయించవద్దు సుమా! దోపిడితనం పోతే, పదవీ వ్యామోహం పోతే అందరికీ అవి లభిస్తాయి. యుద్ధాలు నశిస్తాయి! అందరం బాగుపడతాం! సమృద్ధిగా వుంటాయి అన్నీ" అని దీవించాను.

"తాతయ్యగారూ! అలాగే అడుగుతాం. మీరు కోరిన వరాలన్నీ లభించేవరకు మా పట్టుదల మానం; ముమ్మాటికీ మానం! అప్పటికి మీరు జీవించి వుంటే విమానంలో తీసుకెళ్ళి దేవతాదర్శనం చేయిస్తాము" అన్నారు.

"అలాగే, నాయన్లారా! తప్పక జీవిస్తాను!

30-9-1951 ఇట్లు
మద్రాసు దరిశి చెంచయ్య

-: (సమాప్తం) :-

# వైశ్యప్రబోధిని - క్యాలెండరు

(1996 నవంబరు 21 నుండీ 1996 డిశంబరు 20 వరకు)

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదివారము | | 24 | డిశంబరు 1 | 8 | 15 |
| సోమవారము | | 25 | 2 | 9 | 16 |
| మంగళవారము | | 26 | 3 | 10 | 17 |
| బుధవారము | | 27 | 4 | 11 | 18 |
| గురువారము | 21 | 28 | 5 | 12 | 19 |
| శుక్రవారము | 22 | 29 | 6 | 13 | 20 |
| శనివారము | 23 | 30 | 7 | 14 | |

నవంబరు 25 - కార్తీక పౌర్ణమి

నవంబరు 30 - దుకాణాలు సంస్థలు, కర్మాగారాలు సంస్థల చట్టము క్రింద పొందిన రిజిస్ట్రేషన్ సర్టిఫికెట్‌ను పునరుద్ధరింపు కొను
టకు పంపవలసిన దరఖాస్తు (ఫారము A...)ను అందుకు సంబంధించిన కార్మిక శాఖాధికారికి పంపుటకు చివరి తేది

నవంబరు 30 :- కార్పొరేట్ అసెసీలు 1995-96 సంవత్సరానికి పంపవలసిన ఇన్‌కంట్యాక్సు, వెల్తు ట్యాక్సు అన్యువల్ రిటర్నును అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను శాఖాధికారికి చేర్చుటకు ఆఖరు తారీఖు.

నవంబరు 30 :- కార్పొరేట్ అసెసీలు ఆదాయపు పన్ను చట్టములోని 44 AB సెక్షనుల క్రింద 1997-98 అసెస్‌మెంటు సంవత్సరానికి చెందిన ఆడిట్ రిపోర్టును అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి పంపుటకు చివరి తేది.

నవంబరు 30 :- పదవీ విరమణ చేయు ఉద్యోగులకు 1996 అక్టోబరు నెలలో చెల్లించిన జీతము - ఆ జీతములో తగ్గించి పట్టుకొన్న ఆదాయపు పన్ను వివరాలను తెలుపు స్టేటుమెంటును అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చుటకు ఆఖరు తేది.

నవంబరు 30 :- 1996 అక్టోబరు నెల జీతములపై పట్టుకొన్న ఆదాయపు పన్ను వివరాలను తెలుపు 23వ నెంబరు ఫారమును అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి చేర్చుటకు చివరి తారీఖు.

డిశంబరు 2 :- జ్యేష్ఠ కార్తె రాక - రాత్రి 11-52 గం.

డిశంబరు 15 :- పొట్టిశ్రీ రాముల వర్ధంతి.

డిశంబరు 15 :- చెక్కు ద్వారా అమ్మకం పన్నును చెల్లించు వర్తకులు చెక్కుతో బాటు A-2 రిటర్నును అందుకు సంబంధించిన అమ్మకంపన్ను శాఖాధికారికి పంపుటకు తుది రోజు.

డిశంబరు 15 :- కంపెనీకానిఅసెసీలు రెండవ కంతు అడ్వాన్సు ట్యాక్సును, కంపెనీఅయినఅసెసీలు 1997-98 అసెస్‌మెంట్ సంవత్సరానికి సంబంధించి చెల్లించ వలసిన మూడవ కంతు అడ్వాన్సు ట్యాక్సును చెల్లించుటకు ఆఖరు రోజు.

డిశంబరు 15 :- మూల కార్తె రాక - రాత్రి 12-58 గం.

డిశంబరు 20 :- వైకుంఠ (ముక్కోటి) ఏకాదశి.

డిశంబరు 20 :- A-2 రిటర్నును చలానాతో బాటు అందుకు సంబంధించిన అమ్మకం పన్ను శాఖాధికారికి చేర్చుటకు చివరి రోజు.

**24, 1, 8, 15 ఆదివారాలు**

---

నన్ను మీ టేబులుపై ఉంచుకోండి. ఈ నెల అంతా మీకు కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంటాను.

# శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం, శ్రీశైలము.

( రిజిష్టర్డు నెం. 25/1960 కర్నూల్ )

టెలిగ్రాం అన్నిచోట్ల "VASAVI", తిరుమలలో "KANYAKAMBA"
టెలిఫోన్ నెం. : మార్కాపురం : 22740, 22004
శ్రీశైలం : 87140, 87114
పుట్టపర్తి : 87240, 87440, తిరుమల : 77682

## వైశ్యయాత్రికులకు విజ్ఞప్తి

పై సంఘము ద్వారా నాలుగు క్షేత్రములలో సత్రములు కట్టించి అన్ని రకములైన వసతులు ఏర్పాటు చేసి, శాశ్వతముగా, ఉచిత వసతి, నిత్య భోజనములు ఏర్పాటు చేయులాగున తీర్మానించినాము.

1. వాసవీ సత్రం, శ్రీశైలం :- 150 టాయిలెట్ ఫర్నిచర్ కలిగిన రూములు, తయారుచేసి 25-12-62 నుండి నిత్యభోజనములు ఏర్పాటు చేసినాము. ప్రతి సం॥లో 2 లక్షల మంది వైశ్యులు ఉచిత వసతి, భోజన సౌకర్యములు అనుభవించుచున్నారు. ఇందులకై విరాళములు రూ.1116.00లు శాశ్వత సభ్యత్వం. ఇందుకు వచ్చు వడ్డీ మాత్రం అన్నదానమునకు ఖర్చు చేయబడును. దాత ఫోటో, పేరు వేయబడును. దాత కోరిన రోజు భోజన ఉభయం జరుపబడును. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. సం॥లో ఒక నెల దాతకు రూము కేటాయించబడును.

   30×10 రూము రూ.30,000/-, 15×9 రూముకు రూ.25,000/- అగును. రూము విరాళంయిచ్చిన దాతకు సం॥లో 30 రోజులు ఇవ్వబడును. దాత ఫోటో, పేరు రూములో వేయబడును.

2. వాసవీ నివాస్, పుట్టపర్తి : 2 ఎకరంల స్థలములో నిర్మాణం చురుకుగా సాగుచున్నది. 100 రూములు తయారై యాత్రికులకు ఉచితంగా ఇచ్చు చున్నాము. 16.11.95 నుండి నిత్య భోజనములు ఏర్పాటు చేసినాము. స్థాపకులు శాశ్వత సభ్యత్వం రూ.2116.00 వారి పేరు, ఫోటో కూడా సత్రములో వేయించబడుతుంది. రూ.1,00,000 యిచ్చిన యెడల వారి పేరుతో 30×15 రూమ్ నిర్మించబడుతుంది. దాత ఫోటో, పేరు రూములో వేయబడును. దాతకు 60 రోజులు రూము యివ్వబడును.

అన్నదానమునకు 1. రు.100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. సం॥లో ఒక నెల రూము కేటాయించబడును 2. రు.2501-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం రోజున అన్నదానం దాత పేరుతో జరుపబడును. 3. రు.1251-00 సమర్పించిన సం॥లో ఒక పర్వదినం కాని రోజున దాత పేరుతో అన్నదానరే జరుపబడును.

3. <u>వాసవీ భవన్, తిరుమల:</u> తిరుమలలో నిర్మించనున్న నాలుగు అంతస్తుల భవనములో రెండు హాల్సు 50×100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు). సదరు హాల్సుకు ఈ క్రింది విధంగా డొనేషన్లు స్వీకరించబడును.

హాల్సు డోనార్సు: 50×12 అడుగుల ఒక అంకణము హాలుకు లక్ష రూపాయలు విరాళము నొసగు దాతలకు రూము డోనార్లు మాదిరిగా పరిగణించి సంవత్సరములో 30 రోజులు యివ్వబడును 14 అంకణములు పరిమిత్తం.

రు.2116-00 సమర్పించిన వారికి వంశపారపర్యంతం సభ్యత్వం ఉండును.

అన్నదానమునకు రు.100000-00 సమర్పించిన యెడల శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును.

అన్నదానమునకు రు.10116-00 సమర్పించిన పర్వ దినం రోజునను, రు.6116-00 సమర్పించిన పర్వ దినం కాని రోజున సం॥లో ఒక రోజు జరుపబడును

4. <u>వాసవీ నిలయం ఉప్పుటూరు యతిరాజులచెట్టి ట్రస్టు, కొత్త వీధి, తిరుపతి.</u>

తిరుపతిలో మా సంఘం ద్వారా పై పేరుతో సత్రం కట్టుకొనుటకుగాను మద్రాసు ఉప్పుటూరు యతిరాజులచెట్టి ట్రస్టు వారు తిరుపతి కొత్తవీధిలో షుమారు 7 వేలు చ॥ అ॥ గల పాత భవనమును ఉచితంగా సమర్పించినారు. ఈ పాత భవనం పునః నిర్మాణమునకు 4.10.95 ఉదయం గం॥ల 9-21 ని॥లకు శంఖుస్థాపన, అదే రోజు ఉదయం గం॥ల 9-47 ని॥లకు నిత్యాన్న సత్రంనకు అగ్నిప్రతిష్ఠాపన జరిగినది. భోజనహాలు నిర్మాణం చేసి, వీలైనన్ని అంతస్తులు కట్టి అధునాతనమైన రూములు తయారుచేసి యాత్రీకుల సౌకర్యార్థం చేయుటకు ప్రయత్నం జరుగుచున్నది. అందుకొరకై ఈ క్రింది విధముగా దాతలు విరాళములు సమర్పించకోర్తాము. 4.10.95 నుండి నిత్య భోజనములు, వసతులు ఏర్పాటు చేసినాము. వైశ్య యాత్రీకులు ఉపయోగించుకొన కోర్తాము.

తిరుపతి వసతి సత్రమునకు విరాళములు

రూ.60000/-లు రూముకు సమర్పించిన దాతలకు సంవత్సరమునకు 30 రోజులు రూము రిజర్వేషన్ చేయబడును. ఫోటో వేసి, నాపరాయి పైన వారి పేరు చెక్కించబడును.

రూ.10000/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. సంవత్సరమునకు 10 రోజులు రూము రిజర్వు చేయబడును. ఫోటో వేసి నాపరాయి పైన పేరు చెక్కించబడును. (400 మంది వరకు పరిమితం).

రూ.5000/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. సంవత్సరమునకు 5 రోజులు రూము రిజర్వు చేసి వీరి పేరు నాపరాయిపైన చెక్కించి బిగించబడును. (400 మంది వరకు పరిమితం).

రూ.2116/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. వీరి ఫోటో మరియు బోర్డు వేయబడును.

రూ.1116/-లు సమర్పించినవారికి వంశపారంపర్యంతం సభ్యత్వము కలదు. వీరి పేరు నాపరాయిపై చెక్కించబడును.

నిత్య అన్నసత్రమునకు గాను రు.2501/-లు సమర్పించిన యెడల వంశపారం పర్యంతం సభ్యత్వము, పర్వదినం రోజున అన్న సంతర్పణ ఉభయం జరుపబడును. వారి ఫోటో వేయబడును. రు.1251/-లు సమర్పించిన పర్వదినం కాని రోజులలో ఉభయం జరుప బడును. పై యిద్దరికి వంశపారంపర్యంతం సభ్యత్వం కలదు. రు. 100000-00 సమర్పించిన శాశ్వత అన్నదాతగా ప్రకటించబడును. వీరికి సం॥లో 30 రోజులు రూము కేటాయించబడును.

5. వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్థి నిధి

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూల ధనం ఏర్పాటు చేసి అందులకు రాబడు వడ్డీని EAMCETలో పాసైన నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్హతలు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము..

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీద విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! అలాసహాయము జరుగకున్న ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారుగదా. కాబట్టి ఈ పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైన మన వైశ్యులు విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కాన సర్వేశ్వరుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళముల

నొసంగ ప్రార్థన.

ఒక లక్షరూపాయలు సమర్పించిన వారి ఫోటో శ్రీశైలం, పుట్టపర్తి, తిరుపతి సత్రములలో వేయబడును. వారి పేరు నాపరాయి పైన మూడు సత్రములలో వ్రాయబడును. వీరికి వంశపారంపర్య సభ్యత్వం కలదు. వీరికి సంవత్సరములో 25 రోజులు ప్రకారం మూడు సత్రములలో రూము కేటాయించబడును.

రు.10116.00 సమర్పించినవారు మహారాజ పోషకులు. యీ సంఘమున వంశపారంపర్య సభ్యులు. వీరి ఫోటో పై మూడు సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా మూడు సత్రములలో నాపరాయి పైన చెక్కించబడును.

రు.5116.00 సమర్పించిన రాజపోషకులు. వీరికి వంశ పారంపర్యంతం సభ్యత్వం కలదు. వీరి ఫోటో పై మూడు సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును.

రు.2116.00 సమర్పించిన వారు పోషకులు. వీరికి వంశపారంపర్య సభ్యత్వం. వీరి ఫోటో పై మూడు సత్రములలో ఒక సత్రములో వేయబడును. వీరి పేరు నాపరాయి పైన అదే సత్రములో వ్రాయబడును

రు.1116.00 సమర్పించిన వారు సభ్యులు. వీరికి వంశ పారంపర్య సభ్యత్వం కలదు. వీరి పేరు పై మూడు సత్రములలో ఒక సత్రములో నాపరాయిపైన వ్రాయబడును.

పై ధనమునకు వచ్చిన వడ్డీ EAMCET లో -పాసై- ఇంజనీరింగ్, మేడికల్ సీటు వచ్చిన నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.

6. శ్రీ వాసవీ అష్టోత్తర శతహోమగుండ క్రతువు 16.11.95 నుండి 24.11.95 వరకు పుట్టపర్తిలో జరిపించినాము. 1996వ సంవత్సరములో క్రతువు ఎక్కడ జరుపునదీ జరుగబోవు కార్యవర్గ సమావేశములో నిర్ణయిస్తాము.

**—: ప్రత్యేక ఉత్తర ప్రత్యుత్తరములకు :—**

**మూర్తి వెంకటేశ్వర్లు,**

వాసవీ సత్ర సముదాయం, కార్యదర్శి కార్యాలయం,

మార్కాపురం – 523 316. ప్రకాశం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్.

**N.B :-** పై సత్రముల పేరుతో - D D లు కాని, చెక్కులుకాని ఆయా సత్రములకు పంపకోర్తాము లేదా మార్కాపురం అడ్రసుకైనా పంపవలెను. ఎవరు అడిగినను డబ్బు యివ్వవద్దు. కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోర్తాము.

# శ్రీ వాసవీ వీరబ్రహ్మేంద్ర ఆర్యవైశ్య నిత్యాన్నదాన సంఘం

## రిజిష్టర్డు నెం. 328/94

## బ్రహ్మంగారి మఠం - 516 603. కడప జిల్లా.

భారతదేశము లోని పవిత్ర పుణ్య క్షేత్రాలలో శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామి మఠమూ ఒకటి. కడప జిల్లాలో ఉన్న ఈ క్షేత్రాన్ని సందర్శించి, స్వామి వారి అనుగ్రహమునకు పాత్రులు కావలెనని భారత దేశములోని నలుమూలల నుండీ భక్తులు ప్రతి రోజూ వేల సంఖ్యలో వస్తున్నారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు వచ్చే వైశ్య యాత్రీకులకు భోజన, నివాస వసతులు కల్పించుటకు - 8.2.1993వ తేదీన వసతి భవనములో నిత్యాన్నదాన సత్రమును ప్రారంభించారు. 5.11.1995 ఆదివారము ఈ సత్రమునకు శాశ్వత భవనమును నిర్మించుటకు శంఖుస్థాపన జరిగింది.

ఈ అన్నదాన సంఘానికి

రూ.10,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత మహారాజ పోషకులు గానూ,

రూ.5,116/-లు ఇచ్చిన దాతలు శాశ్వత రాజ పోషకులు గానూ,

రూ.2,116/-లు ఇచ్చిన దాతలు పోషకులు గానూ ఉంటారు.

రూ.1,116/-లు ఇచ్చిన దాతల పేర ఒక రోజు ఒక పూట భోజనం.

భవన నిర్మాణానికి 50 వేల రూపాయలు ఇచ్చిన దాత పేరున నూతన అన్న సత్రములో ఒక గదిని నిర్మిస్తారు.

రూ.10,116/-లు ఇచ్చిన వారు స్థల దాతలుగా ఉంటారు.

ఈ సత్రం భవన నిర్మాణానికీ, నిత్యాన్నదాన పథకానికి విరాళాలు ఇవ్వదలచిన దాతలు నేరుగా, పై పేర క్రాస్ చేసిన చెక్కు కానీ, క్రాస్ చేసిన డి.డి.ని కానీ పై అడ్రసుకు పంపి, రసీదు పొందకోరుచున్నాము.

5 వేల రూపాయలకు పైబడి ఇచ్చిన దాతల ఛాయా చిత్రాలను పవిత్ర నామాలతో అన్న సత్ర భవనమునందు ఉంచుతారు.

ఈ పవిత్ర కార్యక్రమానికి ఉదార హృదయముతో సహకరించవలసిందిగా ఉదార హృదయులైన వైశ్య మహనీయులను కోరుచున్నాము.

"ప్రజాబంధు" "దానశీల"

**జూటూరు శరభయ్య**
కార్యదర్శి

**కామిశెట్టి సుబ్బరావు**
అధ్యక్షులు

# హైద్రాబాదు స్వాతంత్ర్య పోరాటంలో నా కృషి

రచన - కె.సి. గుప్త

సుమారు 50 సంవత్సరముల పూర్వం హైద్రాబాదులో నిజాం పరిపాలన వుండెను. అసెంబ్లీ లేదు, ఎన్నికలు లేవు, వాక్ స్వాతంత్ర్యమూ పత్రికా స్వాతంత్ర్యము లేవు. సమావేశాలు జరుపుకొను హక్కు లేవు. మాతృభాష తెలుగులో విద్య అభ్యసించు అవకాశము కూడా లేకుండెను. ఉర్దూలో విద్యాబోధన జరుగుచుండెను. ఇంజనీరింగు, మెడిసను మొదలగు ఉన్నత విద్యలు కూడా ఉర్దూలోనే అభ్యసించవలసి వుండెను. తెలుగులో రాజకీయ పుస్తకాలు ముద్రించుకొను అవకాశము కూడా లేకుండెను. రాజుగారు నియమించిన సుమారు 10 మంది మంత్రులలో హిందువులు ఒక్కరు వుండేవారు. ఆనాడు జనాభాలో సుమారు 85% హిందువులు వుండిరి. మరియు 15% మహమ్మదీయులు వుండేవారు. ఉద్యోగాలు మొదలగు అన్ని అవకాశాలు ముస్లిములకే ఎక్కువగా వుండేవి. అట్టి పరిస్థితులలో బాధ్యతాయుత ప్రభుత్వము కావలెనని ప్రజలలో విరివిగా ప్రచారము కాబడినది. బాధ్యతాయుత ప్రభుత్వముగా ప్రజలచే ఎన్నుకోదగిన శాసన సభ నుండి మంత్రులు రాజు గారి ఛాయా చిత్రంలో పరిపాలన జరుగు వ్యవస్థ. ఆనాడు ఇట్టి వ్యవస్థ కావలెనని ప్రజలు, పార్టీలు కోరగా ప్రభుత్వము అధికారము ఇచ్చుటకు సిద్ధముగా లేకుండెను. ప్రజల కోరికను నిరాకరించెను. రాష్ట్రంలో జాగీరులు, సంస్థానాలు వుండెను. వారి పరిపాలన ఘోరంగా వుండెను. వెట్టి చాకిరీ బాగా ప్రబలముగా వుండెను. విద్య, నాగరికత లేక గ్రామాలలో ప్రజలు నానా బాధలు పడుచుండేవారు.

అట్టి పరిస్థితులలో స్వేచ్ఛ, స్వాతంత్ర్యాన్ని కోరుతూ బాధ్యతాయుత ప్రభుత్వము కావలెనని హైద్రాబాదు స్టేట్ కాంగ్రెసు 1938 లో సత్యాగ్రహమును ప్రారంభించినది. మతము, రక్షణ, వాటి స్వాతంత్ర్యము కావలెనని ఆర్య సమాజ్ వారు సత్యాగ్రహాన్ని ప్రారంభించినారు. హిందూ మహాసభ వారు పౌర హక్కులు కావలెనని సత్యాగ్రహాన్ని ప్రారంభించినారు. వేలమంది ఈ పోరాటంలో పాల్గొని జైళ్ళకు వెళ్ళినారు. స్వాతంత్ర్య సమర యోధులు నానా హింసలకు గురి అయినారు. ప్రజలలో పెరుగుచున్న అసంతృప్తిని చూసి ప్రభుత్వము రాజ్యాంగ సంస్కరణను ప్రకటించినది. అసెంబ్లీలో ముస్లింలకు 51% మరియు హిందువులకు 49% అని ప్రకటించినారు. ఈ సంస్కరణలను

ప్రజలు, రాజకీయ పార్టీలు బహిష్కరించినారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం ఆవరణలో జాతీయ గీతం 'వందేమాతరం' ఆలపించగూడదని నిషేధాజ్ఞను - ప్రకటించినారు. దీనితో హిందూ విద్యార్థులు, పొరుగు రాష్ట్రాల్లో విద్యనభ్యసించ్చుటకు వెళ్ళినారు. కొంతమంది విద్యార్థులు విద్యకు స్వస్తి చెప్పి పోరాటంలో పాల్గొన్నారు. ఆ రోజులలో స్టేట్ కాంగ్రెసును నిషేధించినారు. రాష్ట్రం బయట 'మన్‌మాడ్' లో కాంగ్రెసు వారు సమావేశాన్ని జరిపి స్వాతంత్ర్యము లభించేవరకు పోరాటము జరుపవలెనని నిశ్చయించినారు.

1942లో దేశ స్వాతంత్ర్య చివరి పోరాటం 'క్విట్ ఇండియా పోరాటం' ప్రారంభమయింది. సంస్థానాలలో పోరాటం కొనసాగనివ్వవద్దని దేశానికి స్వాతంత్ర్యము వచ్చిన తరువాత సంస్థానాలలో స్వాతంత్ర్యము వాటంతటదే వస్తుందనే అభిప్రాయంతో ఉద్యమం తీవ్రతరంగా లేకుండెను. ప్రభుత్వం వారు కొంత మందిని నిర్బంధించి జైళ్ళలో పెట్టినారు.

1947లో దేశానికి స్వాతంత్ర్యము లభించినది. దేశంలో గల సంస్థానాలన్నీ భారత దేశంలో విలీనమైనవి. కాని హైదరాబాదు చేరలేదు. ఈ రాష్ట్రానికి ప్రత్యేక మిలిటరీ, పోలీసు బలగము, స్వంత రైల్వే, కరెన్సీ, పోస్టు మొదలగునవి వుండేవి. ఏ సంస్థానానికి కూడా ఈ సౌకర్యము లేకుండెను. మిలిటరీ, పోలీసు బలగంతోపాటు ముస్లీంల 'రజాకార్' సంస్థ కార్యకలాపాలు పెరిగిపోయినవి. రాష్ట్రమంతటా అశాంతి ప్రబలినది వృత్తి, వ్యాపారము చేసుకొనుటకు అసాధ్యమైనది. ప్రజలు లక్షలాది మంది సరిహద్దున నున్న పొరుగు రాష్ట్రాలకు వెళ్ళి ప్రాణాలను రక్షించుకున్నారు. కమ్యూనిస్టులు ఆయుధపోరాటాన్ని ప్రారంభించి రాష్ట్రంలో వుండే రజాకార్లతోను, పోలీసులతోను, మిలిటరీ వారితోను వీరోచితముగా పోరాడినారు. కాంగ్రెసు వారు రాష్ట్ర సరిహద్దులలో పోరాటం శిబిరాలను ప్రారంభించి పోరాడినారు. ఇట్టి పరిస్థితులలో ఆనాడు హోం మంత్రి అయిన సర్దార్ వల్లభాయిపటేల్ సైన్యాన్ని పంపి రాష్ట్రాన్ని నిజాం పాలన నుండి విముక్తి చేసినారు. పిదప నిజాంను రాజ ప్రముఖ్‌గా కొంతకాలము వుంచి గవర్నరు వ్యవస్థను ప్రారంభించినారు.

నేను 1938లో నిషేధించిన స్టేటు కాంగ్రెసులో సభ్యునిగా వుంటిని. సత్యాగ్రహ కాలంలో స్వతంత్ర సేవకుడిగా వుండి కృషి చేసినాను. హైదరాబాదులో ఉన్నత విద్య నభ్యసించుటకు అవకాశము లేక రాజకీయాలలో దిగి, 1942లో కమ్యూనిస్టు పార్టీ వారితో సంబంధం ఏర్పరచుకొని వాటి అనుబంధ సంస్థలలో పని చేయుచు 1946లో డిటెన్యూగా, సంగారెడ్డి జిల్లా జైలులోను, వరంగల్

సెంట్రల్ జైలులోను, గుల్బర్గా సెంట్రల్ జైలులోనూ, హైదరాబాదు సెంట్రల్ జైలులోనూ, 39 మాసములు జైలులో గడపిన స్వాతంత్ర్య సమరయోధుడను.

## అణాగ్రంధమాల

1938లో అణా గ్రంధమాల అను పేరుతో గ్రంధమాలను ప్రారంభించి అణాకు ఒక పుస్తకము - అణా అనగా ప్రస్తుతం వెల ఆరు పైసలు రాజకీయ పుస్తకములను ముద్రించి ప్రజలు చదువుకొను అవకాశము కలుగజేసినాను. ప్రభుత్వము వారు అనేక పుస్తకాలను నిషేధించినారు. నిజాం ఫర్మానా ద్వారా నా ప్రచురణలను నిషేధించినారు. 50 సంవత్సరాల కాంగ్రెసు చరిత్ర రెండు భాగములుగా ముద్రించి కాంగ్రెసు ప్రచారం సల్పినాను. ప్రధమ పుస్తకం రాజ్యాంగ సంస్కరణలలో ప్రారంభించి, వీరసావర్కర్, పండిత్ జవహర్‌లాల్‌నెహ్రూ మొదలగు వారి జీవిత చరిత్రలను ప్రచురించినాను సురవరంప్రతాపరెడ్డిగారి రచన మొగలు బాయికధలు, కాళోజీ నారాయణరావు గారి కథలు ఆనాటి పరిస్థితులను తెల్పునట్లుగా వుండెను. ఆంధ్రపితామహ మాడపాటి హనుమంతరావు, అడవి బాపిరాజు, జమలాపురం కేశవరావు మొదలగు వారి రచనలు ప్రచురించినాను. 20వ ప్రచురణగా సుభాష్‌చంద్రబోసు జీవితము 1942లో ముద్రించినాను దానిలో కాంగ్రెసు వారు ఆమోదించిన చారిత్రాత్మకమైన 'క్విట్టిండియా' తీర్మానం, మహాత్మాగాంధీ, పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ గారి ఉపన్యాసాల నుండి కొన్ని భాగములను మరియు సుభాష్ చంద్రబోసు అధ్యక్షోపన్యాసము నుండి కొన్ని భాగములను ముద్రించినాను. వీటి సారాంశం ముఖ్యంగా ఆంగ్లేయులు మన దేశానికి స్వాతంత్ర్యము ఇస్తేనేగాని, లేదా యుద్ధం తరువాత ఇస్తామని చేస్తేకాని యుద్ధానికి సాయం చేయాలనీ లేనిచో సాయం చేయవద్దనీ. ఆనాడు హైదరాబాదులో ఐ.జీ.పి యూరోపియను, హోం మంత్రి యూరోపియను. వారు వెంటనే ఈ పుస్తకాన్ని నిషేధించి యుద్ధానికి వ్యతిరేకముగా ప్రచారం చేస్తున్నాడని 'డిఫెన్సు ఆఫ్ ఇండియా' రెండు సెక్షనులతో నామీద కేసు పెట్టినారు. ఆ సెక్షనులలో ఒక్కొక్క దాని క్రింద 12 సంవత్సరాల జైలు శిక్ష వుండెను ఆనాడు హైదరాబాదులో గల ప్రముఖ న్యాయవాదులు, కాంగ్రెసు నాయకులు సర్వశ్రీబూర్గుల రామకృష్ణారావు, కొండా వెంకటరంగారెడ్డి, నందాపూర్కరు, రామాచారి, కృష్ణాచారిజోషి, షిరాబులు హసను, తిర్మీవెంకటేశ్వరరావుగుప్తా మొదలగు వారు పాల్గొని నా పక్షాన వాదించినారు. అనేకమంది యువ న్యాయవాదులు, వివిధ రాజకీయ పార్టీలకు చెందినవారు నా పక్షాన పాల్గొనుటకు సంసిద్ధత తెలిపినారు. ఆంధ్రపితామహులు మాడపాటిహనుమంతరావు గారు నా డిఫెన్సుసాక్షిగా సాక్షమిచ్చినారు. కాశీనాధరావువైద్య, మందుముల రామచంద్రరావు, మందుముల నరసింగరావు, యన్.కె రావు, సురవరం ప్రతాపరెడ్డి మొదలగు ప్రముఖులంతా

సలహాల నొసంగి ఈ కేసులో గట్టిగా పోరాడుటకు తోడ్పడినారు ఇది మా హక్కు, సివిల్ లిబర్టీను ఇలా చేయడమే మా పని అనీ పత్రికల్లలో రేడియోలలో వచ్చిన విషయాలనే ప్రచురించినామనీ, ప్రజలలో ప్రచారం చేయడమే మా అభిప్రాయమనీ నా పక్షాన న్యాయవాదులు వాదించినారు ఏ ప్రభుత్వమైనా కేసులు పెట్టినపుడు విడిచి పెట్టడమనేది వుండదు

హైదరాబాదు రాష్ట్రంలో జరిగిన 3,4 రాజకీయ కేసులలో నాదీ ఒకటి. ఈ రాష్ట్రంలో ప్రజలకు, ఏ హక్కు మరియు అధికారము లేదనీ నిజాం ప్రభుత్వాన్ని కాని, బ్రిటీసు ప్రభుత్వాన్ని కానీ విమర్శించే హక్కు లేదనీ యుద్ధానికి వ్యతిరేకంగా ప్రచారం చేయడం క్షమించరాని పెద్ద నేరమనీ, తీర్పు చెబుతూ, ముద్దాయి చిన్న పిల్లవాడు కాబట్టి ఇతని మీద దయ తలచి 6 మాసములు మాత్రమే శిక్ష విధిస్తూ తీర్పు చెప్పినారు. కొంతకాలము హైదరాబాదు జైలులో గడపిన పిదప హైకోర్టులో అప్పీలు చేసికొని బెయిలు మీద విడుదలయినాను హైకోర్టులో ఒక సంవత్సరము తరువాత కేసు విచారణకు వచ్చి ఇప్పటికే సుమారు మూడు సంవత్సరాలు కావచ్చినది కాబట్టి ముద్దాయి చేసిన నేరము క్షమించరానిదని అందుచేత అప్పీలును తీసుపుచ్చుతూ రూ. 250/ జరిమానా విధిస్తూ, జరిమానా చెల్లించనిచో తక్కిన శిక్ష అనుభవించ వలెనని తీర్పు చెప్పినారు. శిక్ష పడగానే భయపడినారని ప్రజలు అపోహ పడకుండా వుండుటకు గాను 'అణా గ్రంధమాల' పేర ఐదు కొత్త పుస్తకాలను ప్రచురించి తరువాత ప్రచురణ నిలిపివేసినాను.

అల్లూరి సీతారామరాజు - జీవితం ఉర్దూలో ప్రచురించగా ఆ పుస్తకాన్ని ప్రభుత్వం వారు నిషేధించినారు సుమారు 10 పుస్తకాలు 'ఉర్దూలోను, ఆంగ్లంలోను ముద్రించినాను. 'ఆంధ్రుల చరిత్ర' శ్రీ ఖండవల్లి బాలేందు శేఖరం గారి రచన ఆంధ్ర సారస్వత పరిషత్తు మొదటి పుస్తకాన్ని ముద్రించి 50 సంవత్సరాల పూర్వమే ప్రచారం చేసినాను

50 సంవత్సరాల తర్వాత ప్రముఖులు, రీసర్చి స్కాలరు, స్వాతంత్ర్య ఉధ్యమంలో గ్రంధమాలలు మరియు గ్రంధాలయాలు నిర్వహించిన పాత్రను గురించి పరిశోధన జరిపి ప్రత్యేకంగా 'అణాగ్రంధమాల' గురించి వ్యాసములను ప్రచురించినారు. కొంతమంది ఇంకా పరిశోధనలు జరుపుతున్నారు ప్రముఖ కవి స్వర్గీయ దాశరధి గారు ఆంధ్రజ్యోతి వార పత్రికలో 'అణాగ్రంధమాల' గురించి ఆరు వ్యాసములను వ్రాసినారు ప్రముఖ పరిశోధకులు ఆచార్య తిరుమలగారు ఆంధ్రభూమిలో వ్యాసాన్ని వ్రాసినారు డాక్టరు ననుమానస్వామి గారు వ్యాస సంపుటిలో ( మరించినారు కవిరత్న నీలాజంగయ్య గారు ఒక వ్యాసాన్ని ప్రచురించినారు

ఒక్క అణాకు ఎలా పుస్తకాన్ని ప్రచురించగలిగారనీ, ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఎలా నిలబడగలిగారనీ ఆశ్చర్యపడినారు స్టేటు ఆర్క్యాలో నా పైల్సు చూసిన పరిశోధకులు నన్ను వెదుక్కుంటూ వచ్చి వివరాలు తెలుసుకుంటున్నారు. 1942 మరియు

1946 లో హైదరాబాదు స్వాతంత్ర్య చివరి పోరాటంలో హైదరాబాదు పట్టణములో వైశ్య స్వాతంత్ర్య సమర యోధున్ని నేనొక్కణ్ణి మాత్రమే. సికింద్రాబాదులో మరియు జిల్లాలలో అనేక మంది వైశ్య యువకులు జైళ్ళకు వెళ్లినారు.

1951లో నేను జైలు నుండి విడుదలై వచ్చిన తరువాత రాజకీయాలకు స్వస్తి చెప్పి కాలేజీలో చేరి పట్టభద్రుడనైనాను. ఇప్పటి వరకు అనగా 50 సంవత్సరాల నుండి వివిధ సంస్థల ద్వారా ప్రజలకు సేవ చేయుచున్నాను. భారత ప్రభుత్వము స్వాతంత్ర్య సమర యోధునిగా గుర్తించి తామ్ర చక్రం పెన్షను పొందు చున్నాను.

*(15-11-1996 వ తేదీన రాష్ట్ర వైశ్య సంస్థల సమాఖ్య శ్రీ కె.సి. గుప్త గారిని 'వైశ్యబంధు' బిరుదుతో సన్మానిస్తున్న సందర్భంగా)*

## శ్రీమతి పంగులూరు సీతమ్మ చారిటీస్ ట్రస్టు - జనరల్ బాడి

పై ట్రస్టు జనరల్ బాడీ, ఆఫీస్ బేరర్ల ఎలక్షన్ 24-11-1996వ తేదీన ఆదివారం ఉదయం 9 గంటలకు మదనపల్లెలోని వైశ్య హాస్టల్‌లో జరుగుతుందనీ, ఆసక్తిగల వైశ్యసోదరు లెల్లరూ యీ సమావేశములో పాల్గొనవచ్చుననీ ట్రస్టు కార్యదర్శి శ్రీ బి. ఆదినారాయణ శ్రేష్ఠి గారు తెలియజేశారు.

## ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధులు శ్రీ దోర్నాల వెంకటరత్నం గారిక లేరు

కర్నూలు జిల్లా పత్తి కొండ వాస్తవ్యులు, ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు శ్రీ దోర్నాల వెంకట రత్నం గారు తమ 88వ ఏట 5-10-1996వ తేదీన స్వర్గస్తు లయ్యారు. రత్నంగారు నిస్వార్ధ జీవులు. ఆశయాదర్శాలే ఊపిరిగా బ్రతికిన నిజాయితీ పరులు. మహాత్మ గాంధీగారి నాయకత్వములో భారతదేశ స్వాతంత్రోద్యమములో శక్తివంతంగా పాల్గొన్నారు. అనేక సార్లు కారాగార శిక్షను అనుభవించారు. వీరి మరణంతో స్వతంత్ర భారతి ఒక మంచి దేశభక్తున్నీ త్యాగనిరుతున్నీ కోల్పోయింది.

## వేముల గురవయ్య స్వర్గారోహణ

ఖమ్మం జిల్లా మధిర వైశ్య ప్రముఖులు శ్రీ వేముల గురవయ్య గారు 5-10-1996వ తేదీన మరణించారు.

**జీవిత సభ్యత్వ చందా రు. 400/-**

# ఈ నెలలో మీ కర్తవ్యము

(21.11.1996 నుండి 20.12.1996 వరకు)

కార్పొరేట్ అసెసీలు 1995-96 సంవత్సరానికి పంపవలసిన ఇన్‌కంట్యాక్సు వెల్తు ట్యాక్సు అన్యువల్ రిటర్నును అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి ఈ నవంబరు నెల 30వ తేదీలోగా చేర్చాలి

కార్పొరేట్ అసెసీలు ఆదాయపు పన్ను చట్టములోని 44 AB సెక్షనుల క్రింద 1997-98 అసెస్‌మెంట్ సంవత్సరానికి చెందిన ఆడిట్ రిపోర్టును అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి ఈ నవంబరు 30వ తేదీ లోగా చేరునట్లుగా పంపాలి.

పదవీ విరమణ చేయు ఉద్యోగులకు 1996 అక్టోబరు నెలలో చెల్లించిన జీతము - ఆ జీతములో తగ్గించి పట్టుకొన్న ఆదాయపు పన్ను వివరాలను తెలుపు స్టేట్‌మెంట్‌ను అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను అధికారికి ఈ నవంబరు 30వ తేదీ లోగా చేర్చాలి

1996 అక్టోబరు నెల జీతములపై పట్టుకొన్న ఆదాయపు పన్ను వివరాలను తెలుపు 23వ నెంబరు ఫారాన్ని అందుకు సంబంధించిన ఆదాయపు పన్ను శాఖాధికారికి ఈ నవంబరు నెల 30వ తేదీ లోగా చేర్చాలి.

కంపెనీ కాక ఇతర అసెసీలు తమ రెండవ కంతు అడ్వాన్సు ట్యాక్సునూ - కంపెనీ అయిన అసెసీలు తమ మూడవ కంతు అడ్వాన్సు ట్యాక్సునూ 1997-98 సంవత్సరానికి సంబంధించిన దానిని ఈ డిశంబరు నెల 15వ తేదీలోగా చెల్లించాలి.

## దుకాణాలు - సంస్థలు, కర్మాగారాలు - సంస్థలు

1. పై చట్టము ప్రకారమూ రిజిష్టరు కాబడిన మీ వ్యాపారసంస్థ యొక్క రిజిస్ట్రేషను సర్టిఫికెట్టును రెన్యూ (పునరుద్ధరణ) చేయమని కోరుచూ మీమీ ప్రాంతాలకు చెందిన లేబరు ఇన్‌స్పెక్టరు వారికి ఈ (నవంబరు) నెల 30వ తేదీలోగా చేరునట్లుగా A-A ఫారాన్ని పంపుటను మరిచి పోరాదు. పై 30వ తేదీకిలోగా చేరునట్లుగా A-A ఫారాన్ని పంపుటను మరచి పోయినవారు తదుపరి జుల్మానాను కూడా చెల్లించవలసి ఉండును.

ఈ చట్టము అనగా "1966 ఆంధ్రప్రదేశ్ దుకాణాలు - సంస్థల చట్టము క్రింద రిజిస్ట్రేషనుకు, రెన్యూ (పునరుద్ధరణ)కు చెల్లించవలసిన ఫీజులు"

| | | | |
|---|---|---|---|
| (1) | ఏ వ్యక్తులనూ నియమించని దుకాణాలు-సంస్థలు | రు | 10–00 |
| (2) | 5 లేక అంతకు లోపు వ్యక్తులను నియమించు దుకాణాలు - సంస్థలు | రు | 50–00 |
| (3) | 5కు పైబడీ 10కి లోపు వ్యక్తులను నియమించు దుకాణాలు - సంస్థలు | రు | 100–00 |

(4) 10కి పైబడీ 20కి లోపు వ్యక్తులను నియమించు
దుకాణాలు - సంస్థలు రు 200–00

(5) 20 అంతకు పైబడి వ్యక్తులను నియమించు.
దుకాణాలు - సంస్థలు రు 500–00

పై విధంగా ఫీజులను Head of account 0230 Labour and Employment (a) Receipts under labour laws అను శీర్షికన చెల్లించాలి

## అమ్మకం పన్ను చట్టము

1 చెక్కు ద్వారా అమ్మకం పన్నును చెల్లించు వర్తకులు తాము కట్టవలసిన అమ్మకం పన్ను మొత్తానికి చెక్కును వ్రాసి డిశంబరు నెల 15వ తేదీలోగా అందుకు సంబంధించిన అధికారులకు అందునట్లుగా ప్రతినెలా పంపవలసిన A-2 రిటర్నును పంపాలి చెక్కు ద్వారా కాకుండా చలానాద్వారా అమ్మకం పన్నును చెల్లించు అసెసీలు తాము పంపవలసిన A-2 రిటర్నును డిశంబరు నెల 20వ తారీఖున కానీ అంతకు ముందుకానీ చేరునట్లుగా పంపాలి

PHILIVISION

CT 2070





PHILIVISION

Colour TVs



PHILIPS

Authorised
PHILIPS
Dealers

Office . 6044
Resi 6863

VASAVI
GENERAL
TRADERS
GUNTAKAL.
PIN-515 801

## చక్కెర వ్యాధి, రక్తపోటు (బీ.పి.) పూర్తిగ బాగైనది.



డా. గ్రంధే రఘురామ గుప్త



డా. జి.వెంకట ప్రసాద్

'ఆయుర్వేద మార్తాండ' డాక్టర్ గ్రంధే రఘురామగుప్త గారికి, (మార్కాపురం. ప్రకాశం జిల్లా – 523 316.)

ఆర్యా !

నమస్సులు. నేను 20 సం||లుగ బి.పి. తోను 10 సం||లు పైగా షుగర్ వ్యాధితోను పీడింపబడితిని. ఎన్నో విధములగు ఔషధములు సేవించితిని. మద్రాసులోని డయాబెటిక్ రీసర్చి సెంటర్‌కు 3 పర్యాయములున్ను, ఢిల్లీలోని రాంమనోహర్ లోహియా ఆస్పత్రిలో ఒకసారి పరీక్షలు చేయించుకొని వారి సలహామేరకు ఔషధములు సేవించితిని కాని, సదరు మందులు సేవించునంత వరకు మాత్రమే వ్యాధులు తగ్గుచుండెడివి. మీరిచ్చిన ఔషధములు నేను పథ్యము లేకుండ 10 మాసములు సేవించితిని. మీ ఔషధ ప్రభావము వలన, నాకు 6 మాసములకు పూర్తి ఆరోగ్యము కల్గినది. ఇప్పటికి ఒక సం||నకు పైగా నాకు ఆ రోగ చిహ్నములు లేవు. నేను అపుడపుడు తీపి పదార్థములు కూడ తినుచున్నాను, మీ సిద్ధ వైద్యమునకు నా నమస్కారములు.

ఏనుగు చెట్టు వీధి,
ఒంగోలు. ప్రకాశం జిల్లా.
10.7.92.

భవదీయుడు
(Sd.) కొణిజేటి శ్రీమన్నారాయణ,
మాజీ మునిసిపల్ కౌన్సిలర్

